మంతయు పూర్వము యింద్రుడను హోదాలో పెక్కండ్రు రాజ్యమేలినట్లు పురాణములందున్నది. ఇంద్రుడా నాటి రాజులలో నొకడనుటకు ఋగ్వేద, అధర్వణవేదములందును, శతపథ బ్రాహ్మణమందును ప్రమాణములివి :

1. శృ॥ శతమశ్మన్మయీనాం పురామింద్రో వ్యాస్యత్ । దివోదాసాయదాశుషే॥
(ఋగ్వేద తృతీయాష్టక షష్ఠాధ్యాయం 3,6,20 అండ్ 22)

టీ. రాళ్ళతో గట్టబడిన నూరు నగరములను దివోదాసుడను యజ్ఞము చేయించినవానికి ఇంద్రుడిచ్చెను.

2. శృ॥ అథయది రాజన్యోయజతే ఇంద్రవాజం । జయేంద్రాయవాచం వదతేంద్రవాచం । వదతేంద్రవాజం । జాయతో తిక్షత్రగ్ం హీంద్రః । క్షత్రగ్ం రాజన్యః ॥
శతపథబ్రాహ్మణం - కాం. 5 - అ. 2 - బ్రా. 2

3. శృ॥ త్వమిన్ద్రాధిరాజః శ్రవస్యుస్త్వంభూ రభిభూతి ర్జనానామ్ త్వందేవీర్విశ ఇమా వి రాజయుష్మత్ క్షత్రమజరం తే అస్తు ॥
(అథర్వణవేదము కాం. 6 98-5-2 సంపు 2-201 పుట)

ఇట్టి ప్రమాణము లనేకము ముందు పుటలలో నున్నవి.

పై 2, 3 శృతులలో యింద్రుడు రాజనుటకు ప్రయోగములు కలవు. కొండలను చెక్కించి సమస్థలముగా నీ యింద్రుడు నివాసము తేర్పరచెను. ఇంతేగాక మొదటి స్వాయంభువమనువు కాలములో అయన కుమార్తె యాకూతికి జనించిన యజ్ఞుడు లేక సుయజ్ఞుడనువాడు యింద్రపదవిలో నుండి యీ దేవరాజ్యమును పాలించెను. ఆ కాలపు టాచారము ప్రకారమితడు తన సోదరియగు దక్షిణను పెండ్లాడెను. రెండవమనువగు స్వారోచిషునికాలములో రోచనుడనువాడు యింద్రుడయ్యెను. ఇతడు మొదటి యింద్రునికి జనించిన 12 గురు కుమారులలో నొకడు. మూడవ మనువగు ఉత్తముని కాలమునందు సత్యజిత్తను నతడు యింద్రుడయ్యెను. అట్లే తామసుని కాలమున త్రిశిఖుడనువాడును, రైవతుని కాలములో శుభ్రుడను వాడును, చాక్షుషమన్వంతరమున మంత్రద్యుమ్నుడనువాడును, యింద్రులుగానుండి పరిపాలించిరి. వైవస్వతమనువు వచ్చుసరికి పురందరుడు అను యింద్రుడు పాలించెను. ఈ విషయములు మహాభాగవతమున గలవు. ఈ

(*) ఊర్జస్వియను ఇంద్రుడు చివరపాలించినట్లు హరివంశమున గలదు.



రీతిగా ఉత్తరహిందూస్థానమును సర్వసౌఖ్యములతో అనుభవించు యీ రాజ్యమును స్వర్గరాజ్యమనిరి. స్వరాజ్యమగుటచేతనే దాని నట్లు పిలిచిరి. దేవతలును వారి దాయాదులగు రాక్షసులును మొదటి మనువు కాలమునందే వేరుపడిరి. రాక్షసులలో జలంధరుడు జలంధరపట్టణమును, త్రిపురాసురులు త్రిపురములనే పట్టణములను నిర్మించుకొని పాలించుచువచ్చిరి. హిరణ్యకశ్యపుడు, బలిచక్రవర్తి, బాణుడు మున్నగువారందరును వారి భాగధేయములను పాలించుచుండిరి. గాని వీరందరును యింద్రరాజ్యముతో విహితులుగా నుండక అప్పుడప్పుడు వారి రాజ్యమునుగూడ నాక్రమింపజొచ్చిరి. బలిచక్రవర్తి, బాణుడు మున్నగువారి వంశీకులు భారతయుద్ధకాలమునందేగాక 11, 12 శతాబ్దములవరకు నుండి సామంతులుగా చిత్తూరుజిల్లా ప్రాంతమును బాలించుచుండిన నిదర్శనములు శాసనములందు దొరకుచున్నవి. వామనుడు బలిచక్రవర్తిని పాతాళమున కణగద్రొక్కెనని వ్రాసిన పురాణవ్రాతలనుబట్టి యాతని వంశీకులను యింద్రరాజ్యము దాటించి సరిహద్దు (అయోధ్య) రాజ్యమునుగూడ దాటించి, దక్షిణదేశమునకు పారద్రోలినట్లు గ్రహింపవచ్చును. అందువల్లనే తద్వంశీకులచట స్థావరము లేర్పరచుకొన గల్గిరి. ఇంద్రపదవి ఖాళీయైనపుడు వారి కత్యంత స్నేహితులును, సరిహద్దురాజులునగు సూర్యచంద్ర రాజులలో నర్హులగువారి కా పదవి లభించుచుండెను. నహుషుడు. రజి, ఆతనిపుత్రులు. వీరు చంద్ర వంశీకులైనను కొంత కాలము ఇంద్రరాజ్యమును పాలించిరి. ఈ యింద్రరాజ్యము భారత యుద్ధకాలమువరకు నుండెను. శ్రీకృష్ణు డింద్రపట్టణమునకు వెళ్ళివచ్చెను. అర్జునుడుగూడ వెళ్ళి యింద్రునిచే సత్కారము లందెను. కృష్ణమూర్తి, యమ, వరుణాది పట్టణములకుగూడ వెళ్ళియుండెను. ఈ అష్టదిక్పాలుర పట్టణములన్నియు నాకాశమందెచ్చటనో లేవు. ఈ యింద్రరాజ్యమునకు చుట్టును సరిహద్దులలో నచ్చటచ్చట నీ దిక్పాలుర పట్టణము లుండెను. రాక్షసాది యన్యప్రభువుల యాక్రమణ సాగకుండగా, వీరు సరిహద్దులను రక్షించుచుండిరి. ఈ సరిహద్దులలో నున్న రాజ్యమే స్వర్గమని క్రమముగా